# తెలంగానా వార్తలు

## ఆంధ్రోద్యమప్రచారము

(స్థాయీసంఘపక్షమున)

### కొలూరు

ఈగ్రామం నిజామాబాదు తాలూకాలో చేరినది. ఇది శ్రీయుత నీలకంఠ శాస్త్రిగారి ముఖ్తా. ఇచట గృహసంఖ్య ౨౦౦ జనసంఖ్య ౮౦౦ మాల్గుజారిరకం రు ౯౦౦౦ లోకల్ఫండు రు ౫౬౨౪.

అశ్రద్ధ

బాటలసౌకర్యములేదు. త్రాగుటకు చెరువు నీరువాడుకొనెదరు. పారిశుద్ధ్యమునుగురించి రైతులుగాని గ్రామోద్యోగులుకాని యేమాత్రము శ్రద్ధవహించుచున్నటుల కొన్పించదు. ఒకఖాస్గీపాఠశాలగలదు. పదిమంది విద్యార్థులుగలరు. పనివాండ్లు వెట్టిచాకిరికిలోనై యున్నారు. రైతులు ఋణగ్రస్తులై యున్నటుల తెలిసినది. సర్కారీకిస్తుకొగాదా జరుగుచున్నది. పరపతిలేని రైతులు నానాబాధల పడుచున్నారు. ఇంకొకవైపున సాహుకారులయొత్తిడి జరుగుచున్నది. ఎట్టివిధమైన వ్యాధులులేవు. పశువులకు మేతదొరుకుచున్నది. నీటిసౌకర్యముగలదు. టపాఖానాలేదు.

— —

### కొండూరు

ఈగ్రామం నిజామాబాదు తాలూకాలో చేరినది. ఇచట గృహసంఖ్య ౧౨౮ జనసంఖ్య ౮౫౦ మాల్గుజారిరకం రు౬౦౦౦ లోకల్ఫండు రు ౩౬౨ గలదు.

వెట్టిచాకిరి

బాటలసౌకర్యము లేదు. హరిజనులకు గొండ్లవాండ్లకు చాకండ్లకు ఇనాములులేవుకాని వెట్టిచాకిరి తప్పుటలేదట. ఒకఖాన్గిపాఠశాలగలదు ౨౦ మందిపిల్లచదువుచున్నారు. పటేలు పట్వారీలు గ్రామపారిశుద్ధ్యవిషయమై శ్రద్ధతీసుకొనుచున్నటుల కనుపించదు. రైతులుచాలాహీనస్థితిలోనున్నారు. సర్కారిరకంకొరకు ఒకవైపు సాహుకారిఅప్పుకొరకు, ఇంకొకవైపు యొత్తిడి జరుగుచున్నది.

సర్కారీరకం వసూలుకాకున్న పటేలుపటువారీలకు జెర్మానాలు వేయుచున్నారట.

---

### మాకులూరు

ఈగ్రామం నిజామాబాదు తాలూకాలో చేరినది. ఇచట గృహసంఖ్య ౮౦౦ జనసంఖ్య ౧౬౦౦ మంగలికత్తులుచేయుటలో ఇచటివారు చాలా పేరుపొందినవారు. హరిజనులకు, ఇతరులకు యినాములులేవుకాని వెట్టిచాకిరి చేయించుకొనుటలో ఎవరునువెనుదీయుటలేదు. లోకల్ఫండు పాఠశాలకలదు. ౮౦ మంది విద్యార్థులుగలరు.

మాల్గుజారిరకం రు ౨౦౦౦౦ లోకల్ఫండు ౨౦౦౦ వున్నది. నిజామాబాదు వెళ్లుటకుతప్ప ఇతరత్రాయే గ్రామమువెళ్లవలసియున్నను బాటలు చక్కగాలేవు. నీటిసౌకర్యముగలదు.

ఆంధ్రపత్రికా పఠనాలయస్థాపనము

ఈశ్వరనామసంవత్సర జ్యేష్ఠబ ౧౨ల రోజున యువకసోదరులు సమావేశమై పఠనాలయస్థాపనానంతరము కార్యనిర్వాహక మెన్నుకొనిరి.

శ్రీయుత వెంకట్రావుగారు, అధ్యక్షుడు
,, గంగారాంగుప్తగారు కోశాధిపతి
,, భోజన్నగారు సహాయకార్యదర్శి
,, వెంకట్రామగారు కార్యదర్శి
,, హనుమంతరావుగారు సభ్యుడు
,, లక్ష్మాగౌడుగారు ,,
,, పోసెట్టిగారు ,,
,, రాములుగుప్తగారు ,,

ఉద్దేశ్యములు

౧. ఆంధ్రులలో పరస్పరసానుభూతి కలిగించుట.

౨. చదువురానివారలకు పత్రికలు చదివివినిపించుట.

౩. ఐకమత్యము కలిగియుండుట.

౪. మాతృభాషాభివృద్ధికై పాటుబడుట.

ప్రస్తుతముగోలకొండపత్రికనుతెరుమాసము లకుగాను తెప్పించుటకు తీర్మానించుకున్నారు.

------

## గోలకొండ కథలసంచిక

| | | | |
|---|---|---|---|
| చందాదారులకు | వెల | రు | ౧-౦-౦ |
| ఇతరులకు | ,, | ,, | ౨-౦-౦ |

### వెలమల

ఈగ్రామము నిజామాబాదు తాలూకాలో చేరినది. ఇచట గృహసంఖ్య ౬౦౦ జనసంఖ్య ౨౫౧౦ ఒక లోకల్ఫండు పాఠశాలగలదు. ౨౫ మంది విద్యార్థులుగలరు. మాల్గుజారీరకం రు౧౬౦౦౦ లోకల్ఫండురకం రు౧౧౦౦ గలదు. బాటలసౌకర్యమె తమాత్రములేదు.

గ్రామము మొత్తముకలిసి దాదాపు ౩౦౦౦౦ ఋణభారముగలదని తెలిసినది. మాల్గుజారిరకం తకావిరకం వసూలుకాకుండ యున్నదట. పారిశుద్ధ్యత ఎంతమాత్రము లేదు. హరిజనులకు, గొండ్లవాండ్లకు యినాములులేవు కాని వెట్టిచాకిరిచేయుట తప్పుటలేదు. చేయకున్న యో గ్రామములో యుండవద్దనియు గుడిసెలుండనీయమనియు బెదరించెదరట. పోలీసుఠాణా గలదు. పాపము వీరికష్టము లెన్నటికి దేవునికి తోచకున్నది.

ప్రబోధము

పైగ్రామాదులలో యక్షిగానముద్వారా ప్రభుభక్తి, ఐకమత్యము, జీవకారుణ్యము, మద్యపాననిరసనము, శీతజ్వరము, ఆంధ్రోద్యమతత్వము, గ్రంథాలయ, పత్రికాపఠనప్రయోజనము, దానము, ధర్మము మొదలగువిషయములను గురించిబోధించనయినది.

---

## సంస్థాన వార్తలు

### మైసూరులో పోలీసు రెగులేషను

రెండవ దఫా బొమ్మకు శవాలంకారము

ఊరేగింపు చేసినవారి అరెస్టు

పోయిన గురువారమునాడు బెంగుళూరులో ప్రజాహితోద్యమములలో పనిచేయుచుండాని అనువారు మైసూరులో ఇటీవల బెంగుళూరునగర మేజిస్ట్రేటు పోలీసు రెగ్యులేషను దఫా ౭౪ ననుసరించి ఇచ్చిన పౌరస్వాతంత్ర్య భంగకరమగు నిషేధాజ్ఞయొక్క ప్రజల నిరసనభావమును వెల్లడించుటకై ఆదఫాయొక్క బొమ్మనొకదానికి పాడెగట్టి వల్లకాటికి తీసికొని పోవుచున్నామని ప్రకటించు పెద్దపత్రికలతో ఒక ఊరేగింపుదీసెను. ఊరేగింపు నగరముచుట్టును తిరిగినతర్వాత చామరాజపేటలో, పోలీసువారు సంచారిని అరెస్టుచేసి రాకపోకల నడ్డగించుచున్నాడను నేరము మోపిరి.

### ఫెడరేషను పర్పాటుకై మరొక ఆంగ్లేయుడు రప్పించబడుట

భారతదేశపు ఫెడరేషనులో ఏయే సంస్థానములు ఏషరతులతో చేరగోరుచున్నది తెలియజేయవలసినదిగ పోయిన ఆగస్టునెలలో ఇండియా ప్రభుత్వమువారు సంస్థానాధిపతులకు వ్రాసియుండిరి. ఆలేఖలకుజవాబులుకూడ పంపబడియుండెను. అవచ్చిన ప్రత్యుత్తరముల నన్నిటిని ఒకక్రమపద్ధతిప్రకారము వర్గములుగ విభజించుటయందును, వాటినిగూర్చి బ్రిటిషు యింగ్లాండులోని "సెక్రటరీ ఆఫ్ స్టేట్" గారితోను ఇండియాప్రభుత్వ రాజకీయశాఖవారు ఆలోచనలు చేయుచున్నారనియు, ఆలోచనలు త్వరగాముగియునట్లు తోడ్పడుటకును, న్యాయ సంబంధము లైనక్లిష్టాంశములలో సలహానొసగుటకును జానియర్ పార్లమెంటరీ కౌన్సెల్ అగు జె. కొలెట్ గారు పిలిపించబడుచున్నారనియు ఇండియాప్రభుత్వమువారి ప్రకటనయొకటి వెల్లడిచేయుచున్నది. ఫెడరేషను ఎప్పుడు వచ్చునో ఏమోగాని, ఈలోపల ఆంగ్లేయ నిపుణుల దిగుమతివ్యాపారమునకు గిరాకి హెచ్చినది!

### ప్రపంచతత్త్వజ్ఞ సమ్మేళనమునకు మైసూరుప్రతినిధి

మైసూరు దర్బారువారు రానున్న ఆగస్టు మొదటివారములో ప్రారంభమగు ౧౯౩౭ సం॥ లో ప్యారిసులో జరుగగల ప్రపంచతత్త్వజ్ఞ సమ్మేళనమునకు మైసూరుప్రతినిధిగ వి. సుబ్రహ్మణ్యయ్యరు గారిని పంపుచున్నారు. లార్డ్ పెర్సీగారు విశదతత్త్వజ్ఞాన మనునదిలేదని అన్నమాటకుపిరు ఆసమ్మేళనమందు సమాధానమొసగెదరట. ఈసమ్మేళన సమావేశము ముగిసినపిమ్మట అయ్యరుగారు తమను ఆహ్వానించిన ఇంగ్లాండు, ఫ్రాన్సు, జర్మనీ, ఆస్ట్రియామున్నగు యూరోపుదేశములలోని తత్త్వజ్ఞానపరిశోధనసంస్థలకు పోయెదరట. వారివెంట బెంగుళూరులోని రామకృష్ణమతమునకుచెందిన స్వామి సిద్ధేశ్వరానందగారు పోవుచున్నారు.

### పాలెస్టైను విభాగము

పాలెస్టైనును రాయల్ కమిషనువారు ఆరుదేశములో అరబ్బులకుకొరకు ఒకభాగమును యూదులకొకభాగమును, బ్రిటిషువారికొక భాగమును—— ఇట్లు మూడుచీలికలు చేయవలెనని సిఫారసు చేసిరి— అరబ్బులందరును భారతదేశముసల్మానులును, ఇతరదేశముసల్మానులు ఈవిభాగమును దూషించుచున్నారు— అరబ్బులు మరల తిరుగబడునట్లుండుటచే, అలరులను అణచుటకు బ్రిటిషుయుద్ధనౌకలు పాలెస్టైను రేవులకు పంపబడినవి—

### కాంగ్రెసు మంత్రులు

వార్ధా కాంగ్రెసు కార్యసంఘ తీర్మానము అన్ని పక్షముల దేశీయులచేతను, బ్రిటిషు పత్రికలు వాయకుల చేతను మెచ్చుకొనబడినది— తాత్కాలిక మంత్రివర్గములన్నియు రాజీనామానీయ నిశ్చయించుకొనినవి— మధ్యరాష్ట్రములో గవర్నరుగారు కాంగ్రెసు నాయకునిపిలువగావారు మంత్రివర్గముముగూడ ఏర్పరచిరి— ఇతర రాష్ట్రములలోగూడ గవర్నర్లు కాంగ్రెసు నాయకులను పిలువ నిశ్చయించుకొనిరి— కొందరిని పిలిచినారు—

అస్పృశ్యులు ఒకరివెంటనొకరు హిందూమతమునుండి జారుకొనుచుండ, ఇంకను మీ రెండిపట్టు వదలలేమని సనాతనులను ప్రతివారును హెచ్చరించుమారే! కాని మాదయున్యజొకడు అస్పృశ్యులు హిందువులలోనుండి లేచిపోయిన, హిందూమతములో ఇక అస్పృశ్యత ఉండకేయుండదుకదా. అది సంస్కర్తలకు మాత్రము సంతోషముకొవాలని అనుచున్నాడు!

* * * *

ఇపుడుజరుగుచున్న చైనా జపాను యుద్ధప్రారంభమునుగూర్చి రూటరు సంజయుడు జపాను చైనాసైనికులు తమాషాగా పోట్లాడుకొనుచుండ నిజమైనపోరాటము జరుగుచున్నదనిభ్రమించి దూరమునుండి ఒకజపానుసైనికుడు ఫిరంగిప్రేల్పుటచే యుద్ధము ప్రారంభమయ్యెనని తెలిపినాడు. యుద్ధము ప్రారంభమైనవెంటనే రూటరుకు మొదటి పోరాటము తమాషాయని తెలియగలిగినపుడు, జాలైవతేదివాడు ప్రారంభమైన యుద్ధము ఇప్పటికిని శాంతించకుండుటయేల! రూటరుకు సైనికులలో ఏఒకపక్షమువారినుండియో మాత్రమేకదా విషయము తెలిసినది. అటుగా పోరాడుచున్న ఇరుపక్షములవారలలో అన్యపక్షము ఒకరికైనను తమాషాపోరాటముయుద్ధముగా పరిణమించినట్లు తెలిసియుండునవియే రూటరుగారి వార్తలో సూచన. అమాత్రమునకు ఇంతరథ సమెందుకో? నిజమేమన జపాను "తోడేలు-గొర్రెపిల్ల" కథలోతోడేలువలె ముండే చైనాకుకబ

## వినోదరత్నములు

చెవుము కి శాస్త్రి

లించుటకు సకలసన్నాహములను చేసికొనిసమయము వెదకుచున్నది!

* * * *

ఈసారి మైసూరుశాసనసభ బడ్జెటుసమావేశములో దివానుగారుఉపన్యసించుచు ఆర్థికమాంద్యము తొలగిపోవుచున్నదనుచు దానినిభూమిపన్నుబకాయిలమొత్తములు తగ్గుచున్నవనుమాటతో సమర్థించినారు. కానివారిప్రభుత్వముయొక్క అధికారమునందే తయారైన ౧౯౩౫–౧౯౩౬ సం॥పు మైసూరురాజ్యపరిపాలననివేదికలో సహకార సంఘములను గూర్చి ఇట్లువ్రాయబడినది. "సంఘముల సంఖ్యయు, సంఘసభ్యులసంఖ్యయు, వసూలైన మొత్తము అకంటెపేరియున్న బాకీమొత్తము లెక్కువగ నుండుటయు–వీటికన్నిటికిని ముఖ్యకారణము జనులఆర్థికస్థితిలో మాంద్యమింకయు ఎప్పటివలె నుండుటయే." దివానుగారు శాసనసభలో చెప్పినమాటనిజమో, లేక పైనివేదిక వాక్యము నిజమో! రెండు అభిప్రాయములును జాగ్రతగా ఆలోచించుకొని తయారు చేయబడినవే!

* * * *

సంయుక్తరాష్ట్ర ప్రధానమంత్రి ఛత్రి నవాబుగారు గవర్నరుగారికి రాజీనామా యొసగినట్లు జూలై నాటి ఇంగ్లీషుదినపత్రికలలో ప్రకటింపబడినదానిని ఖండించుచు, తాను "గవర్నరుగారికి రహస్యపుటుత్తర మొకదానిని వ్రాసియుంటి"ననియు, "అది పత్రికలలో వెల్లడిచేయుట కుద్దేశించబడినది కా"దనియు అనుచునే, "బ్రిటిషుప్రభుత్వ పక్షమున ప్రముఖులు చేయుచుండినప్రకటనలను, ఇచ్చట గాంధిగారిప్రకటనలను గవర్నరు దృష్టికి గొనివచ్చుటే లేఖయొక్క ఉద్దేశ్యము. పైప్రకటనలను బట్టి కాంగ్రెసువారు మంత్రిపదవుల నంగీకరించుటకే నిర్ణయించుచో నేనును నామంత్రులును మంత్రిపదవులనుండితొలగుటకు సిద్ధముగానున్నామనిమాత్రమే ఆలేఖలో తెలియచేసితిని" అని రహస్యమును ఆసోసియేటెడుప్రెస్సు ద్వారా పత్రికలలో వెల్లడించుట ఎందుకో!

* * * *

మరియొక రాజవంశీయుడు ఒకసారిపెండ్లియై విడాకులనిచ్చిన స్త్రీని వివాహమాడినాడు. వివాహము జూలై ౨౬వ తేదీ జరిగెను—స్వీడనురాజు సోదరుడనికమారుడగు ఛార్లెస్.ప్రిన్సుగారు రాజమందిరములో కొలువుచేయు ఒకనౌకరుకూతురితో (ఇదివరకుఇంగల్స్వానుఅనునరవిశార్య]వివాహమాయెను. పంచాంగకర్తలెవరుగాని ఈశ్వరనామసంవత్సరమునకుఇటువంటిఫలితములనుసూచించినటు కానరాదు. బహుశాపాశ్చాత్య ప్రపంచ సంబంధముల పంచాంగములలోనెక్కడనైన ఇట్టిఫలితము సూచింపబడియున్నదో ఏమో!

* * *

ఈజూలై నెల౧–వ తేదినుండి మద్రాసులోని "మాడర్ను హిందూహోటలు"వారు కాంగ్రెసుపార్టీకిజెందిన శాసనసభ్యులకు తక్కువరేటుకు భోజనము, బస మున్నగుసౌకర్యములనొసగుటకుఅంగీకరించిరని ఆంధ్రపత్రికలో ఒకవార్త. దీనిలోలోతు రహస్య మేమైయుండునో!

* * *

ఈసారి సరిహద్దురాష్ట్రములో వజీరుస్థానమందు అక్కడి కొండజాతులవారితోటి పోరాటముప్రారంభమై రామాసములు దాటినది; రోజుకు ఒకలక్షరూపాయలవంతున ఖర్చైనది ప్రభుత్వసైనికులో ౧౬౩మంది చనిపోయిరి; ౨౮౦మంది గాయపడిరి. ఇంతకు సాధించినది శత్రువులలో ౭౦౦ మందిని చంపుట, ౬౬౦ మందిని గాయపరచుట; అంతకంటె ఎక్కువ ఏమియులేదు! "పరిస్థితులు చాలవరకు దారికి వచ్చిన"వట గాని "అంతోశతగ్గలే"దని ప్రభుత్వమువారు ముఖము తప్పుకొనుచున్నారు. బ్రిటనులో ఆంగ్లపత్రికలే సరిహద్దులో ఇంతవరకు అవలంబించబడినవిధానము చెడినదనియు, ఇంకొకమార్గము చూడవలసినదనియు ఘోషపెట్టుచున్నవి, కనుక ప్రభుత్వమువారు విధిలేక అకొండజాతులవారియెడ సమాధానమార్గమవలంబించ నిశ్చయించుకొన్నట్లును, నారల చీటికిమాటికి ఇట్టిపోరాటములు రాకుండ శాశ్వతమైన ఏర్పాటుఒకటిచేసికొననిశ్చయించినట్లునువార్తలువచుచున్నవి. శాశ్వతపరిష్కారమునకు కాంగ్రెసుసూచించుసివిల్ పరిపాలనపద్ధతికంటె మరియొకటి ఉన్నదా! అపద్ధతి ఇదివరకొకసారి ఇండియా ప్రభుత్వమువారిచే ప్రయోజనవంతమగునట్లు అవలంబించబడినదే!

—— ——

The best medium for reaching 7 million Andhras, of the State Advertise in Golconda Patrika

# గోలకొండపత్రిక

# GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First-Telugu Bi-Weekly in Andhra Desa and the leading Telugu Newspaper of H.E.H. The Nizam's Dominions.

వర్తకులకు

నిజాంరాష్ట్రపు ఎనిమిది జిల్లాలలోని ఆంధ్రులలో మీ వర్తకవృద్ధికి సాధనము? గోలకొండ పత్రికలో ప్రకటనము

**Vol. 12.** **Thursdy 22—7—1937** **No. 22**

# నూతన శకారంభము

## శాసనసభలో "వందేమాతర స్తవము"

దేశస్వాతంత్ర్యమునకు సర్వస్వమర్పించిన త్యాగమూర్తులగు మహర్షి బులుసు సాంబమూర్తిగారు రధ్యక్షులగుట

సంపూర్ణస్వాతంత్ర్య సిద్ధిప్రయత్నమే మనకర్తవ్యము

అహింసా సిద్ధాంతములపై జరుపబడుచున్న భారతస్వాతంత్ర్యసమర మద్వితీయము

(మా ప్రత్యేకవిలేఖరి)

మదరాసు; ౧౫-౭-౩౭:-

వార్ధాలో అఖిలభారత కాంగ్రెసు కార్యకారిణిసభయం దంగీకరింపబడిన పదవీస్వీకార తీర్మానము దేశమునం దలిజడి కలిగించినది; కలిగించుచున్నది. పరిపాలనారధము, కాంగ్రెసు నాయకులు పట్టుబట్టినపిదప, సాగుటకు రాష్ట్రములందు గవర్నరులకోరికపై యేర్పడిన తాత్కాలిక మంత్రివర్గములాదిగ కలిగించిన తొందరివారము. కాంగ్రెసు ధాటికినిలువలేక ఆతాత్కాలిక మంత్రివర్గము లన్ని రాష్ట్రములందునాడే బ్రతుకుజీవుడాయని రాజీనామా లొసగినవి; ఇంకను నొసగుచున్నవి- గవర్నరులీ రాజీనామాల నంగీకరించి మంత్రివర్గము లేర్పరచుటకు కాంగ్రెసు నాయకుల నాహ్వానించిరి- మనమద్రాసు రాజధానికి బహుకాలము నుండి యాశించుచున్న శ్రీరాజగోపాలాచార్యులుగారు ప్రధానమంత్రిత్వము స్వీకరించిరి- శాసనసభకు త్యాగమూర్తులైన శ్రీబులుసు సాంబమూర్తిగారు వక్త (Speaker)గా నేకగ్రీవముతో శాసనసభయంతయు "మహాత్మాగాంధీకిజై", "వందేమాతర"మను జాతీయధ్వనులతో ప్రతిధ్వనించుచుండ నెన్నుకోబడిరి-

### అద్వితీయము

సభాధ్యక్షులగు శ్రీసాంబమూర్తిగారు ఖద్దరుటంగవస్త్రము, ఖద్దరుత్తరీయము, ఖద్దరు చంకసంచితో అధ్యక్షపీఠమలంకరించిన దృశ్యము మదరాసు శాసనసభకొక యపూర్వశోభకలిగించుటయేగాక కాంగ్రెసున కపరిమితానందము లాజయముకలిగించి తీరునని సూచించుచుండెను- ఇంతేగాదు శాసనసభాకార్యము వందేమాతరం జాతీయగీతముతో ప్రారంభింపబడుట మరొకవిశేషము- ఈవిధముగా యింతవరకేశాసనసభ ప్రారంభింపబడలేదనుట నిశ్చయము-

సాంబమూర్తిగారు తమను సభ్యు లేకగ్రీవముగా యెన్నుకొనినందులకు వమస్కృతుల తెలియపరచిరి.

సభ్యురాండ్రలలో నొకరగు శ్రీమతి లక్ష్మీశంకరంగారు వందేమాతరగీతమును మిగుల శ్రావ్యముగా పాడిరి- సభ్యులందరు ప్రార్థనపూర్తియగునంతవరకు తమతమ స్థానములందు నిలువబడిరి-



త్యాగశీలురులు

ప్రధానామాత్యులగు శ్రీరాజగోపాలాచార్యులుగారు సభాధ్యక్షులను సభ్యులకెరింగించుచు "మీరు మాతృదేశానికి సర్వస్వమర్పించిన త్యాగమూర్తులు- ఇట్టిమహనీయుని మీరధ్యక్షులుగా నెన్నుకొనినందులకు నేనుమిమ్ముల అభినందించుచున్నాను- మాతృదేశ స్వాతంత్ర్యసమరము తీవ్రరూపముదాల్చిననాటినుండి నేటివరకువీరు దానియందులీనమై రేయింబవలు తీవ్రముగా కృషిసలుపుచున్నారు- నేడుమనము వీరిని అధ్యక్షులుగా నెన్నుకొనుటచే రణరంగమువీడి ఆర్తమగుస్థాన మధిష్ఠించినందులకు సంతసము- ప్రజాస్వామిక దేశాల్లోనిపార్లమెంటరీ సాంప్రదాయములనుబట్టి వీరాస్థానమునకు అర్హులని విశదపడుచున్న"దని నుడివిరి-

### పటేలుగారిసామ్యము

ఇంతేగాక యుట్టిస్థానముగురించి మాట్లాడునప్పుడు అద్భుతవ్యక్తియగు విఠలభాయి పటేలుగారిమూర్తి మనకుప్రత్యక్షమగుచుండును- నేడుదేశమంతా సగర్వముగా కీ-శే- పటేలుగారిని సంస్మరించుచున్నటుల వీరిని (అధ్యక్షులు) మనరాష్ట్రము సగర్వముగా చెప్పుకొనునటనిశ్చయము- వీరు ఆమహానుభావుని సాంప్రదాయములను తప్పకయవలంబించెదరనియాశించుచున్నా"నని బలికిరి-

కాంగ్రెసు కార్యప్రణాళికనుగూర్చి ముచ్చటించుచు "కాంగ్రెసుమంత్రివర్గమందలి నేను నాసహోద్యోగులు శక్తికొలది కాంగ్రెసుకార్యములతో సమానత్వమేర్పరచుటకు ప్రయత్నించెదము- నియోజకులవలన మాకార్య ప్రణాళికపూర్తిగా విచారింపబడినదనుట నిశ్చయము"నిరి-

శాసనసభయందలి వివిధపక్షముల ప్రతినిధులు సభానాయకుల యభిప్రాయముతో నేకీభవించినటుల విశ్వాసపరచుచు రాష్ట్రప్రభావియభివృద్ధికి అధ్యక్షులగు శ్రీసాంబమూర్తిగారొకయమూల్యోదాహరణమేర్పరచుట శుభావహమని తెలియపరచిరి-

అధ్యక్షులుసభ్యులకు కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు తెలియపరచుచు "కాంగ్రెసువారు పదవిస్వీకరణసమస్య యంగీకరించుటవలన దేశమునందు నూతనరంగమేర్పడినది- సంపూర్ణస్వాతంత్ర్యమునకు ప్రతివారు ప్రయత్నించుట ముఖ్యకర్తవ్యము- దేశమందలి అన్నివర్గములకు ప్రాతినిధ్యమువహించినది కాంగ్రెసు- కాబట్టిప్రతివారి సేవసలుపుటయే యధ్యక్షునికర్తవ్యము- శాసనసభయొక్క స్వాతంత్ర్యము, గౌరవము నిబంధనలననుసరించి రక్షించుటకు శక్తికొలదికృషిసలిపెదన"ని విశదపరచిరి-

సభయందు నిష్పక్షముపూర్తిగా యవలంబింపబడునని తెలుపుచు "భారతవర్షము అహింసాపద్ధతిపై స్వాతంత్ర్యసమరము సాగించుభాగ్యముబడసినది; కొంతవరకు విజయవంతమైనద"నిబలికిరి-

### ఉపాధ్యక్షురాలు

శ్రీమతి అచంటరుక్మిణమ్మగారు ఉపాధ్యక్షురాలుగా నేకగ్రీవముతో నెన్నుకోబడిరి- "అధ్యక్షుని, ఇతరసభ్యుల సానుభూతి సాయములతో తమబాధ్యత నిర్వహించుటకు ప్రయత్నించెద"నని తమకృతజ్ఞత తెలియపరచుచు బలికిరి-

### ప్రధాన పార్లమెంటరీ కార్యదర్శి

శ్రీఅయ్యదేవర కాళేశ్వరరావుగారు శాసనసభలో ప్రధానపార్లమెంటరీ కార్యదర్శిగా నియమింపబడిరి-

—

# కొచ్చిను

## పత్రికలపై దాడి

(ఒకవిలేఖరి)

బొంబాయిలోని భారతీయ పౌరస్వాతంత్ర్యసంఘముయొక్క జనరల్ సెక్రెటరీగారు కొచ్చినుదివానుగారికి ఈక్రిందిలేఖ పంపినారు,

"ఘనతవహించిన కొచ్చిను మహారాజుగారు త్రివేంద్రమునుండి వెలువడు "మళయాళి" మరియు "భారత్ పత్రిక" అను రెండు మళయాళపత్రికలను తమ సంస్థానములోనికి దిగుమతిచేయరాదనియు, ఎక్కడగాని అమ్మరాదనియు ఒక శ్రీముఖమును జారీచేసిరని మాకు తెలిసినది. ఈశ్రీముఖము ఇటీవలనే సంస్థానములోనుండు పత్రికలపై విధించబడిన నిర్బంధముల వెనువెంటనేవచ్చుటచే సంస్థానప్రజల పౌర స్వాతంత్ర్యమునుగూర్చి మాకుచాల ఆందోళనగనున్నది. అత్యవసరచర్యగా వార్తాపత్రికల నిబంధనశాసన మనుదానిని శ్రీముఖముచే అమలుచేయుటయు, ప్రభుత్వవిధానమును విమర్శించినందుకు మూడు వార్తాపత్రికలపై న్యాయస్థానములలో చర్యగైకొనుటయు, రాజద్రోహభావముగల వ్రాతకై "వెస్టర్న్ స్టార్" అను పత్రికయొక్క సంపాదకునికి ౪ ఏండ్లు కఠినశైదుశిక్ష యొసగుటయు, కట్టుటకు సాధ్యముకానంత జమానతును అపేక్షించి "కేరళ" పత్రికను అణగద్రొక్కుటయు— ఇవన్నియు ఇటీవలజరిగినవే. పత్రికలహక్కులపై ఈవిధముగ దాడితీయుటవలన ఆందోళన కలుగుచుండుటచే భారతపౌర స్వాతంత్ర్యసంఘము నశించిన విశ్వాసమునుమరల కలిగించుటకై వెంటనే ఆశ్రీముఖములను రద్దుచేయవలసినదిగ గోరుచున్నారు."

భారత పౌరస్వాతంత్ర్య సంఘకార్యదర్శి మళయాళిపత్రికపై నిషేధాజ్ఞను అంతకుముందుపత్రికల హక్కులరొంప గైకొనబడిన ఇతర చర్యలతో సంబంధింప జేయుచున్నారు, ఐయితే ఆ "మళయాళి", మరియు "భారతపత్రిక" అనునవి తిరువాన్కూరులోచేరిన త్రివేంద్రమునుంచి వెలువడునవిఅని తెలిసికొనినపుడు ఆచర్యకు ఇటీవల తిరువాన్కూరు సంస్థానములో హరిజనులను రానిచ్చు దేవాలయములలోకి పోయినవారు శుద్ధిపొందిన గాని కొచ్చిను దేవాలయములలోనికి పోనుపీలులేదు. అని కొచ్చిను మహారాజాగారు ఇచ్చినఆజ్ఞకుకూడ సంబంధముండునేమోయని దూరపువారికి అనుమానము తోచకమానదు.

—

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda PowerPress Hyderabad. Editor K. Balakrishna Reddy